శ్రీ "సాహిత్యలత" ప్రథమ కుసుమ మగు నీ 'వివేకానంద' అపూర్వపద్ధతిని వ్రాయఁబడిన రూపకము, నూతన మార్గదర్శి మృదుమధురమగు శైలితో, హృదయాహ్లాదకరముగ, భక్తిజ్ఞానవైరాగ్యములఁ బ్రబోధించుచు మానవ జీవిత రహస్యములఁ దెలుపు నిట్టి రూపకములు ఆంధ్రభాషయం దిప్పటికి లేవనియే చెప్పవలెను.

విద్యావిధానమునందు మార్పు సహజముగ సంచలనముగలిగిన యీ దినములలో నిట్టి గ్రంథము లుపవాచకములుగా నియమింపఁదగినవని నా నమ్మిక. పాఠ్యగ్రంథనిర్ణేతలిట్టి గ్రంథముల నామోదింతురు గాక!

శ్రీమంతులును వైశ్యకులాభరణులును విద్యాభిమానులును నగు మ. రా. రా. శ్రీ ఊటుకూరి రామయ్యశ్రేష్ఠి గారు ఈ గ్రంథమునకు కృతిపతియగుట ముదావహము.

ఆబాల్యమిత్రులగు కృతికర్తయు కృతిభర్తయు అన్యోన్య సహాయసంపత్తితో నీ సాహిత్యలత నానా సత్కుసుమ సంశోభితమై వర్ధిల్లునట్లు చేయుదురుగాక!

ఇట్లు విన్నవించు విధేయుఁడు

చీరాల, 9—1—35

రావు వెంకట సుబ్బారావు,
B A B Ed

# ప్రసంశ

ఖ్యాతిగాంచిన యీ కృతిపతి సద్వంశసంజాతుడు- ఆ గాదనంశీయు, ఊటుకూరివారు ధనాఢ్యులేగాక, ధర్మచింత గల, పరోపకారపారీణులు- కవులను, పండితులనుసత్కరించుట వీరియింటి ఆచారము ఆదిలో యీ గ్రామమున శ్రీ వైద్యాలయమున నిర్మించుటకు కొన్ని యకరములు దానమొసంగిన కీర్తిశేషులు కోటయ్యశ్రేష్ఠిగారు యీకృతిపతితండ్రిగారు ఇక్కడ, విద్యాలయమును స్థాపించి అస్మదాదులకు విద్యాదానమొసంగిన కీర్తిశేషులు ఊ॥ రా॥ వెంకటేశ్వర్లుగారు, ఈ కృతిపతి పినతండ్రిగారె గ్రామమున పలుకుబడిగల పెత్తనదార్లు వీరు

జాతీయవాదులైన, కృతిపతి రామయ్యశ్రేష్ఠిగారు, పురపాలకులుగనుండి, ప్రజారంజకులైరి

వీరి ప్రఖ్యాతి నగ్గడించుటకు ఈ రెండుమాటలు చాలు ననుకొంటాను

ఇట్టి రామయ్యశ్రేష్ఠిగారు ఈ "వివేకానంద"కు కృతిపతియగుట, నాకును విశేషించి, "సాహిత్యలత"కును శుభోదయము

ఇట్లు విన్నవించు విధేయుడు,

కృష్ణారావు,

గ్రంథకర్త



కృతికర్త

"దేశమునుద్ధరించుటకు గద్యకావ్యము లవసరములు"

కృ. కృ.



కృ తి ప తి

మ రా రా శ్రీ ఊటుకూరి రామయ్యా శ్రేష్ఠిగారు

[illegible]

నరేంద్రనాథ్

విశ్వనాథదత్తు

భువనేశ్వరి

రామచంద్రదత్తు

దేవేంద్రనాథ్

శ్రీరామకృష్ణుడు

ప్రతాపచంద్రుడు

విద్యాధరి

వృద్ధనారి

N B — మఱికొందఱు శిష్యులు, మిత్రులు సమయాను
కూలముగ ప్రవేశింతురు

# వివేకానంద

## రంగము 1

(నరేంద్రుడు మలినాంబరుడై ఆలోచనాయత్త చిత్తముతో వచ్చు చుండును మరియొకవైపునుండి మహా దేవేంద్రనాథు డరుదెంచు నరేంద్రునిజూచి)

నరేంద్రా! నరేంద్రా!

నరే — (విస్మయముతో) మహాత్ములా? నమస్కారములు,

దేవేం — అన్యమనస్కుడవై యుంటివి?

నరేం — లేదే సహజముగ నిట్లే యుందునుగదా?

దేవేం — నీదృష్టి యీప్రపంచముననున్నట్లు దోచదు భావ
నాలోకమున విహరించుచుందువా? సంస్కారప్రియు
డవుగదా, నీకీ మలినాంబరములేల?

నరేం — స్వామీ? హృదయమాలిన్యమును బోగొట్టుటకు
• బ్రయత్నించవలెను గాని, వస్త్రములెట్లుండిననేమి?

దేవేం — అట్లని బూడిదలో బొర్లాడుగదా?

నరేం — (నవ్వుచు) బూందయా? విజ్ఞానయుతోవిశాలురగు
తామిట్లు మాటాడుచున్నారు? పరమపవిత్రమైన బూ
దిదయే శంకరునకు మైబూత

దేవేం — గషసుదనమా?

నరేం — కాదు మరభిప్రాయపడుచున్నారు

దేవేం — అక్షరహింతమగు పరివర్తనము

నరేం — సుభగ్రాహ్యము      స్వామీ! ఒక సంశయము
గలదు

దేవేం — చెప్పుము

నరేం — తామెప్పుడైన భగవంతుని జూచితిరా?

దేవేం — మాటలతో దేవదేవుని జూడదలచితివా?

నరేం — నావిషయముగాదు మీకాభాగ్యము లభించినదా?

దేవేం — నావిషయము నీకనవసరము

నరేం — ఆగ్రహించెదరేమో?

దేవేం — ఆగ్రహానుగ్రహములకు నేనెవ్వడను

నరేం — చిత్తము      మఱియొకపర్యాయము దర్శించెదను
సెలవు

సంద

( నరేంద్రుడు కొంత దూరమేగునప్పటికి రామచంద్రుడెదురుపడును )

నరేం — దత్తూ ! ఎక్కడికి ప్రయాణము ?

రామ — నీవో ?

నరేం — ఏదో పనిమీద బోవుచుంటిని లెమ్ము

రామ — నేనుగూడ నంతే సరగాని, నీ వివాహవిషయమే మైనది ?

నరేం — ఏమగును, నీకు దెలియకుండ ? ఇష్టములేదని తొలుత నే జెప్పియుంటిని అదియొక ప్రీతి బంధకము

రామ — ప్రీతి బంధకమా ?

నరేం — అందువలన నాజీవితమే వ్యర్థమగును ఈ విషయమనేక పర్యాయములు విపులముగ జెప్పియుంటిని మఱల వాగ్వివాదమేల ? నేను స్వేచ్ఛా విహారిని నన్నిట్టే స్వాతంత్ర్యగీతముల బాడుకొననిమ్ము

రామ — పెద్దలిందులకు సమ్మతించిరా ?

నరేం — ఆశ్చర్యము ! నా వివాహమునకు పెద్దలసమ్మతమేల ?

రామ — మత సాంప్రదాయ

నరేం — ఇక చనువుపుచ్చుకున్నవారి వలెను మాటాడకుము గొఱ్ఱెవలె కన్నులు మూసుకొని ముందువారి ననుసరించుటేల? స్వబుద్ధి నుపయోగించుకొనగూడదా?

దత్తా! ఎంతటి మూఢాచారములు? విపరీత సిద్ధాంతములు? హిందూమత మెంత పవిత్రమైనదో అంతవిచిత్రమైనదిసుమా!

రామ — నరేంద్రా! పాశ్చాత్యవేదాంతసారమంతయు నీ వొక్కడవే గ్రోలితివేమి?

నరేం — పొరబడక హేతువాదనకు దిగుము భగవంతుని జూచితిమని ప్రగల్భములాడుచు లోకులను మోసగించువారెందఱుండిరో తెలియునా?

రామ — నీ యాలోచన లానందింపదగినవి నీవంటి ప్రతిభా భాసురు లిప్పుడు దేశమునకవసరము మహాక్షేత్రమగు దక్షిణేశ్వరమున నొక మహనీయుడు గలడు అతడు నీ సంశయములను దీర్పగలడు

నరేం — ఆస్థలమంత పుణ్యప్రదమైనదా?

రామ — పుణ్యక్షేత్రము రాణి రాసమణి, విశేషవంతు

ప్రియాసలక్షార్చి యాపుణ్యకార్య మొనర్చెన అఖండ ప్రశాంతి శాలవాలమై బ్రహ్మానందగంధము లెల్లెడ నల్లుకొనుచుండు నతివిశాలముగ, సుందరారామమున, గగనవీథినంటు శిఖరములతో, శాస్త్ర సమ్మతము కాళికాలయము నిర్మింపబడినది నడిభాగమున విశాల యమున, నెడమభాగమున నాట్యమందిరమున, వఱ కొన్ని శివాలయములున్న, గలవు పరమపవిత్రమైన దక్షిణేశ్వర వనవాటికాభ్యంతరమున శక్తిస్వరూపిణి యగు కాళి, నిరంతరము విహరించుచు, పిలిచిన పలుకు చుండునని వాడుక శ్రీరామకృష్ణుడు డామాతవలన ధన్యుడయ్యెను

నరేం — అలాగా ?

రామ — పనియున్నది నన్నికబోవనిమ్ము (తనదారిని బోవును)

[నరేంద్రుడు నడచుచు తనలో]

దత్తు చెప్పినవన్నీయుని, నిన్నటిదినము, సురేంద్ర మిత్రునింట జూచియే యుంటిని ఆయనను గూర్చి

పలువురు పలువిధముల జెప్పుచున్నారు పలువుర మాటేల ? నాహృదయమందొక మార్పు గలిగినది అయినెందుకో, నన్ను దేవంగ తెలిపి ఆజ్ఞాపించెను ఒక పర్యాయము దక్షిణేశ్వరమునకు రమ్మనమని బలవంతపఱచెనుగూడ

(నిష్క్రమించును)



వ ం ద

# రంగము II

--o--

## దక్షిణేశ్వరము

(గదిలో పవిత్రాసనముపై రామకృష్ణుడేకాగ్ర చిత్తమున నుండును)

రామ — తప్పక వచ్చెదనని చెప్పెనుగదా ? రాలేదే మనస్సునకింత యారాటమెందులకు ? ఔను అతడు నక్షత్రములలో చంద్రుడు ఎంతటిస్ఫురద్రూపి ? పవిత్రతను సూచించునా యాకర్షిక నేత్రములందొక మహాతేజము గోచరమగుచున్నది. వేషభాషలకేమిగాని, ఉన్నతాశయములుగల దయార్ద్రహృదయుడు-వివేకజ్ఞానముగల కార్యశూరుడు అదేమోగాని, నిత్యానందకరమై, తేజోమయమగు బ్రహ్మపదార్థమతనియందు మూర్తీభవించినట్లు దోచుచున్నది సందేహమేల ? ఇంద్రియలకాత్మగతియె ప్రమాణము అతడు మహాపురుషుడు. ఎంతచక్కగ పాడగలడు ? నాహృదయము

మా పెందులకు ? ఆ మధురగానమునకు కఠినశిలాతతులైన కరగిపోవునేమో ? దేవీ! (అర్ధనిమీలితనేత్రుడై ధ్యానతత్పరుడగును ).

[పశ్చిమద్వారమున, నరేంద్రుడు మఱికొందరు మిత్రులతో ప్రవేశించి, నమస్కరించును )

రామ — వచ్చితివా ? సంతోషము కూర్చొనుము

నరేం — మహాత్ములు నిరీక్షించుచుండిరిగాబోలు ?

రామ — ఆనాటి నీమధురగానమునకు తన్మయుడనై పోతిని

నరేం — చిత్తము.

రామ — ఇటురమ్ము (నరేంద్రుని యేకాంత ప్రదేశమునకు గొనిపోయి, కనుగొనల నానంద బాష్పములుగ్రమ్మ కరస్పర్శనము జేయుచు)

ఇన్నాళ్ళకా నీవు వచ్చితివి? ఎంతటి నిర్దయుడవు? నన్నిట్లు కష్ట పెట్టదగునా ? నీకమనీయ ముఖారవింద సందర్శన భాగ్యము నపేక్షించి, వేచి, భరింపరాని బాధ పడితిని సుమా! (కేలుమోడ్చి) స్వామీ! నీవవతార

పురుషుడవని గ్రహించితిని మానవలోకము నుద్ధరింప
నేతెంచిన నారాయణాంశ సంభూతుడవగు నరుడవుగాని
కేవలమనుష్యుడవుగావు, నీ వియోగమున కోర్చుట
కష్టము అనుగ్రహించెదవా ?

నరేం — ఏమిది మహాత్మా ! ఎంతపొరబడితిరి ? రండి యథా
స్థానమునకు (ఇరువురువచ్చి కూర్చుందురు)

నరేం — (తనలో) ఏకాంతముగ నేదియో యుపదేశించు నను
కొంటి, గాని, యిదియేమి ? వీరికి పిచ్చియెత్తినదా ? వి
శ్వనాధ దత్తు తనయుడనగు నరేంద్రుడను గానా ?
నారాయణాంశ సంభూతు డనుచున్నాడే ఆశ్చర్యము !
ఈ మాట లర్థరహితములా ? తపస్సంపన్ను లసత్యము
లాడుదురా ?

రామ — (నరేంద్రుని సమీపించి) మధురఫలములివిగో--
చెఱకుగడలు-ఆరగింపుము

నరేం — మిత్రులున్నారు అందఱము కలసి భుజించెదము
వాటిని మాకిచ్చి వేయుము

రామ — అట్లుగాదు, వీటిని నీవొక్కడవే స్వీకరింపవలెను అ
నంతరము వారి పాలు వారికొసంగబడును

నరేం — (తనలో) సర్వసంగ పరిత్యాగియగు నిమహనీయునకును పాపిరాదిరాధ నింతటి కనుమేమి? చెప్పెడిమాటలకును, చేసెడి చేష్టలకును సంబంధములేదే?

రామ — నరేంద్రా! దీర్ఘాలోచన సేయుచుంటివి!

నరేం — అవును! గనియము నాకొక సంశయము గలదు మహాత్మా!

రామ — అనుమానమేమందుకు?

నరేం — భగవంతుని జూడగలుగుదునా?

రామ — చూడవచ్చును చూచుటేగాదు, మాట్లాడనచ్చునుగూడను గాని, భగవంతునిగూర్చి అంత నిష్టతో నుండువారెవరు? భోగ భాగ్యములకొరకో, భార్యాపుత్రాదులకొరకో, నిరంతరము కలవరించుచుండు మానవులకెట్లు భగవద్దర్శనము లభించును? నిష్కల్మష హృదయముతో, తదేక ధ్యాన తత్పరుడగు వానికి భగవంతుడు ప్రత్యక్షముగాడా?

నరేం — ప్రత్యక్షమగునా? నేను చూడగలనా?

రామ — ఒక్క చూచుటేనా, కలిసి మెలిసి, యాడుకొనవచ్చును (ధ్యానమున కనులమూయును)

నరేం — చిత్రము! భగవన్నామోచ్చారణ మాత్రమున ఈ మహాత్ముడు పరవశత్వమును బొందుచున్నాడు అదృష్టవంతులకెవరికో గాని, సాక్షాత్కారము లభింపదు గదా? ఆహా! ఇతడు పరమ పవిత్రుడగు జను గు ఋషి ఇంకేమిగావలెను?

( రామకృష్ణుడు కనుల దెరచును )

నరే — అయ్యా! నేను

రామ — పోయివచ్చెదవా? సాధ్యమగునంత త్వరలో మరల వచ్చెదనని వాగ్దత్తము చేయుము

నరేం — తమ యాజ్ఞ శిరసావహింతును గదా?

రామ — నీకొఱకు తపించుచుందును సుమా! ఈ సారి యొంటరిగ రమ్ము

నరే — చిత్తము

(నరేంద్రుడు మిత్రులతో నిష్క్రమించును)

— • — —

# రంగము III



## నరేంద్రుని గృహము

(విశ్వనాథదత్తు పరుండియు, రామచంద్రదత్తు భువనేశ్వరి కూర్చొనియు మాట్లాడుచుందురు)

విశ్వ — దేహధర్మములు శాశ్వతములు గావుగదా? నాథుటను బోయిన వెనుక నేనియెట్లగునో?

రామ — నిజమేగాని, అతడు విముఖుడైనపుడు మనమేమి చేయగలము?

భువ — రామచంద్రా! నీమాటలుగూడ పెడచెవినిబెట్టునా?

రామ — తల్లీ! నేననేకపర్యాయములు బ్రయత్నించి విఫలమనోరథుడనైతిని

విశ్వ — ఇతని చర్యలు నాకర్థమగుటలేదు కళాశాలయందున్నపుడు నోగాని, నేనెప్పుడు ప్రశ్నించినను సరియగు సమాధానము రాదు—, సరిగదా, పిచ్చివానివలె సంచరించుచుండును

రామ — నేను అతడెప్పుడు ఊహాలోకమున నూరేగుచుం

డను దక్షిణేశ్వరమున కేగి వచ్చుచున్నప్పటినుండియు అతనిపిచ్చిన ర్తనము పూర్తిగా మారిపోయినది

విశ్వ — దక్షిణేశ్వరమునకు పలుమారులు బోయివచ్చుచుంటిని

రామ — రామకృష్ణుని యెడగురుభావముదయించినది ఆగురువుగారితని నెడబాసి, యొక క్షణమైన నుండలేడట

విశ్వ — ఏమి విచిత్రము ! సర్వసంగపరిత్యాగియగు రామకృష్ణుని కింత యనురాగముండదగునా ?

రామ — నరేంద్రుడిశ్వవతార పురుషుడని దేవి యతనికి జెప్పినదట ఆ మహాత్ముడసత్యము పలుకడుగదా ?

విశ్వ — నమ్మజాలను, ఇదంతయు భ్రాంతి

రామ — నేనుగూడ మొదట నట్లే దలంచితిని

విశ్వ — ఇప్పుడు మాత్రము ? సరిగాని మనవాడు ఆదినుండియు వితండవాదిగదా ? ఈ వేదాంతములయందు విశ్వాసములేనివాడే ? ఇప్పుడెట్లు లోబడెనో ?

రామ — ఇప్పటికైన లొంగినాడా ? గురువర్యు డనేక విధముల బరీక్షించుచున్నాడు కొన్ని నిదర్శనములు గనబడినను, తన్నుదా నమ్మలేని స్థితియందున్నాడు

విశ్వ — ఈ పరిస్థితులను బట్టిచూడ, నరేంద్రుని మనకుప యోగ పడునను యాశలేదుగదా ?

రామ — అతనిని బంధింపరచినందువలన స్థితిగతులు మరింత విపరీతమగునేమో ?

విశ్వ — నిజమే కాని ముందుగతి ?

రామ — బోధపడుటలేదు

విశ్వ — నేనవిశేషకాలము జీవించి యున్నానను దయించినది సుమా !

రామ — తండ్రీ ! అట్లేంతలచెదరు సర్వేశ్వరుడు మిమ్ము రక్షించు గాక !

భువనేశ్వరి — (కన్నీరుగార్చుచు, రామచంద్రా !

రామ — తల్లీ ! ?

భువ — (కన్నులు తుడుచుకొనుచు) ?

రామ — చూడజాలను, మాతా ! ఏమిసెలవు ?

భువ — కష్టసుఖములెరిగి యుంటివిగదా ? సంసారము

రామ — అన్నియు తెలియునుగాని కర్తవ్యము !

భువ — నరేంద్రునిబుద్ధి మరల్పలేవా ?

రామ — ప్రయత్నించితినిగదా, శక్తిచాలదు !

భువ — నావకూఁమగువఱకు బ్రియత్నించవలదా ?

రామ — ప్రయోజనములేదు అతనిఘోరశి వేరగానున్నప్పు
డు మనశ్రియ నిష్కమగున

రవ — ఎపుగూఁడ నన్లే చెప్పచుంటివా !

విశ్వ — ఎవరికర్మము వారిది

రామ — అమ్మా ! తెలియని పసివాడా ? ప్రతిభాభాసురుడ
గు నరేంద్రునికి సాఁగరపువారెవరు ? మీదుమిక్కిలి
యతనిమోరము మహాత్మ్యాప్తమైనదని నానమ్మక
ము మహాపురుషలక్షణము లతనియందనేకములు గోచ
రమగు చున్నవి అనతికాలమున నతడు విజ్ఞానవేత్తయ
గునని నాయూహ ఇందలకు మనము గర్వపడవలెను
గదా ?

భువ — కోతికలకేమి, గగన కుసుమములేగద ? ఎక్కడి
నరేంద్రుడు ? ఎక్కడికథ ?

రామ — గగనకుసుమములో, కరతలామలకములో, చూడ
గలవు గదా ?

విశ్వ — రెండు దినములు నరేంద్రుడు నాకనులయెదుట నుం
డుటవసరమని తోచుచున్నది ఇప్పుడెచ్చటనుండెనో,

పిలుచుకొనిరాగలవా ?

రామ — దక్షిణేశ్వరమునకు వెళ్ళయుండనోపు వెళ్ళివచ్చెద సెలవా ?

విశ్వ — మంచిది (భార్యతో) దాహము

(రామచంద్రదత్తు భువనేశ్వరి నిష్క్రమింతురు)

# రంగము IV

(రామకృష్ణుని గదివెలుపల, నరేంద్రుడు, ప్రతాపచంద్రుడు మఱికొందరు మిత్రులు కూర్చుని సంభాషించుచుందురు )

నరేం — నాకిదంతయు సమ్మోహమయముగనున్నది ఇచ్చటికి రాకున్న, విలపించుదు, నాకొఱకు బయలు దేరివచ్చును నాయందొక దివ్యజ్యోతి గోచరించుచున్నదట భగవదంశ సంభూతుడనని దేవియే చెప్పినదట ఇట్టిచిత్రము లెన్నియోగలవు •

ప్రతా — ఇవన్నియు సత్యములగునా ?

నరే — ఆయనుమానమే నాకునగేదు మనమనస్సే మనలను మోసగించుచుండునని, పాశ్చాత్య వేదాంతులు చెప్పుచుందురు నేనామహనీయు ననేకవిధముల, బరీక్షించి, నవ్వులపాలైతిని

ప్రతా — కన్నుల ముందు జరుగు దానినెట్లు కాదందుము

నరేం — మఱియొక చిత్రము నాశరీరము నాయన తాకినపుడెల్ల, తన్మయుడనై, కోటి సూర్య ప్రభాకలితంబైన

యొకమహావెలుగును మహాబుషులును, పలువిధముల గాంచనగును ఆ క్షణకాలమేమిజరిగినదో చెప్పలేని స్థియందుంటుటగూడ తటస్తించినది

ప్రతా — గారడియా ?

నరేం — చెప్పజాలను

ప్రతా — (పరిహాసముగ) ఏమిరనరేంద్రా ! నీవుగూడనిట్లు భ్రమపడుచుంటివి ఎక్కడిభగవంతుడు ? ఎక్కడి బ్రహ్మాండము ? ఈవిగ్రహారాధనలేమి ? విశ్వసింపజాలను నీవెప్పదైన భగవంతుని జూచితివా ? ఋదంతయు మాయ సుమా !

నరేం — ఈ అద్వైత సిద్ధాంతము

ప్రతా — అద్వైతమా ? గిద్వైతమా నాలోను, నీలోను, ఈగిన్నెలోను, ఈచెంబులోను, అన్నిచోట్లను భగవంతుడున్నాడట, ఏలకనుపించడో? ఎవరువిందురీమాటలు? కూటికి గుడ్డకుగాని భగవంతుడెందులకోయి ?

( రామకృష్ణుడు ప్రవేశించును నరేంద్రప్రతాపులు లేచి నిలువబడుదురు )

రామ — ఏమనుచున్నారు ? కర్ణకఠోరములు నరేంద్ర

నామాటలు విశ్వసించకున్నపుడిక్కడికేల రావలెను ? నరేం — వచ్చినంతమాత్రమున తామనినదానికెల్ల ! నరేననిసమ్మతింపవలెనా ?

రామ — వేడుకార్థమరుదెంచుచుంటివా? (అర్ధనిమీలితనేత్రుడై నరేంద్రుని చేతితో స్పృశించును )

నరేం — (ఆశ్చర్యమున) ఆహా ! చిత్రము ! నేనెక్కడనున్నాను ? ఏలోకమిది ? కనులకు మిరుమిట్లు గొలుపు ఈ వెలుగేమి? గురువర్యులెక్కడ? ప్రాపుడేడీ ? . . ఆఁ ! ఆఁ ! అఖండ భూవలయమెల్లవ్యాపించి, మింటివరకెగబ్రాకి, బాలసూర్యునివగిది ప్రజ్వరిల్లుచున్న, ఈ మహావెలుగు సచ్చిదానందరూపుడగు భగవంతుడా ? తెలిసినది, మహాత్మా ! తెలిసినది. నమస్కారములు అజ్ఞానాంధకారమునబడి, శుష్కహృదయుడనై, గురువుల మాటలద్రోసిపుచ్చితిని కరుణామయా ! నీవు సర్వవ్యాపివి సమస్తతేజములకు నీవేమూలము సూర్యుని ప్రచండదీప్తినీది రాకాసుధాకరుని ధాళధళ్యమునీది సకలగ్రహనక్షత్రములు, నీ సంకల్పమాత్రముననే,

చరించి, భాసమానములగుచున్నవి. నీవు గాక, జ్ఞాన జ్యోతిని బ్రసాదింపగలవారెవ్వరు? సకల విజ్ఞాన సంపన్న శక్తి సామర్థ్యములకు కారణభూతుడవు నివే గదా? రాకాశారద చంద్రచంద్రికలు—మహాగ్రిగ్రీష్మరుధ్యాహ్నములు— నీ కారుణ్యప్రతాపము లేగద? సమస్తచరాచరజంతు సంతానముల నాడించు జగన్నాటకసూత్రధారీ! దివ్య తేజోమయమూర్తీ! విశ్వాసాగ్ని నా హృదయసీమయందు, ప్రజ్వలింపజేసి, నాజీవితమును పవిత్రమును, తేజోవంతమును జేయుము సర్వకాలసర్వావస్థలయందును నిన్నే గొలుచుచుండుటకు శక్తిదయసేయుము—అన్యములుగోరను కార్యాకార్యములన్నియు నీ కొఱకె గాఢభక్త్యానురాగసంకలిత హృదయుడనై, ప్రతి ఫలశూన్యముగ సేవజేసెదను స్వీకరింపుము స్వామీ!

రామ — (మరల చేతితో స్పృశించును)

నరేం — స్వామి! క్షమింపుము ప్రితాపా! నీవు జూచితివా?

ప్రితా — దేనిని?

నరేం — ఓరి పిచ్చివాడా! ఆ మహావెలుగును చూడలేదా?

పరితా — ఏ మహా వెలుగు ?

నరేం — అదుగో! నాకు గ్నపించుచున్నదే!

పరితా — ఎక్కడ ? ఎక్కడ ?

నరేం — ని నెత్తిన హృదయమున వదనమున గా
లో లేదా ? ఈ తరులతాదులయందు— మల్లెమొల్ల
లయందు సమస్తప్రాణి కోటియందు— లేదా ?

పరితా — ఏమిన రేంద్రా! పిచ్చియెత్తినదా ?

( రామకృష్ణుడు నిష్క్రమించును రామచం
ద్రదత్తు ప్రవేశించును )

రామ — నరేంద్రా!

పరితా — ఇంకేమి నరేంద్రుడు ?

నరేం — ఓహో! ఎప్పుడు వచ్చితివి మహాత్మా!

రామ — నేను మహాత్ముడనుగాను గుర్తుపట్టలేకుంటివా ?

నరేం — (నవ్వుచు) నేను వెఱ్ఱివాడననుకొంటిరా ?

రామ — నే నెవరినో చెప్పరాదా ?

నరేం — రామచంద్రమూర్తి వి గాదా ?

రాము — కాదు, రామచంద్రదత్తుడు

నరేం — వేషము లేదు అంతయునొకటే విశేషము లేమి ?

రాము — ఇంటకి రావా ?

నరేం — అవసరమా ?

రాము — తండ్రిగారి స్థితి చక్కగ లేదు నిన్ను చూడ వలెనని కోరిరి

నరేం — ప్రమాదమగు స్థితియా ? వచ్చెదను, రమ్ము, పోవుదము

• •

(అందరు నిష్క్రమింతురు)

# రంగము V

## నరేంద్రుని గృహము

( వెలుపలి భాగమున రామచంద్రదత్తు కూర్చొనియుండును )

రామ — ఆహా! దుర్భరము! సత్కుల సంజాతుడున, గౌరవనీయుడును, విశాలహృదయుడును, నగు విశ్వనాథదత్తు కుటుంబ మెట్టియిక్కట్టుల పాలుగావలసివచ్చినది? భగవంతుడా! బ్రతికినన్నాళ్లు, అడిగినవారికి లేదనకుండ, పేదలకు పెన్నిధానమై, దాన ధర్మాది సత్క్రియా చరణుడై, తన సర్వస్వమును వెచ్చించిన, విశ్వనాథదత్తు భార్యాపుత్రులకు, తుట్టతుదకు తిన తిండికూడ లేకుండ, జేసితివేమి? ఆహా! ఆస్తియంతయు ఋణదాతల పాలై పోవ, ఘోరదారిద్ర్య మనుభవించు చుండిరే! ఇక వారిగతియేమి? (ఆలోచనమున) ఏమిధైర్యము! ఇంతజరుగుచున్నను కన్నతండ్రి మరణించినన, నరేంద్రుడు కంట

నీవు జెట్టడే? చలింపడే? ఎంతటి వజ్రిసన్నిభ హృదయ ము? నరేంద్రా! నరేంద్రా! నీలో మానవత్వము నశించినదా? దయాదాక్షిణ్యములు లేవా?

మాతృదేవి క్షుద్బాధచే మాడుచుండ, నీవు, "దేవుడు, దేవుడ"ని యూరేగుచుంటివేమి? ఎక్కడిదేవుడు? దేవుడున్నాడా? అన్నాతురులై, దరిద్ర శోకావేశమున, యెలుగెత్తి యేడ్చు భక్తులను రక్షింపరాదేమి? ధనవంతుల హృదయములు కరుగలేదే? మానవతులల్లాడుచుండ దుర్మార్గులు మానభంగము చేయుచున్నారే? పరమభక్తాగ్రేసరులగు సత్యసంధులను బాధించి క్రూరులు కుబేరులగుచున్నారే! పెద్ద పిన్నల తారతమ్యము లేక, ధర్మాధర్మములను పాటింపక, స్వార్థపరులై, ప్రజలను హింసించు నరహంతకులకే జయము చేకూరుచున్నదే! వేలకు వేలు దారుణకృత్యముల ను క్షణమును జరుగుచునే యున్నవే! ఏదీ? భగవంతుడు ఉన్నచో, లోకకళ్యాణము కొఱకు పాటుపడు త్యాగమూర్తులను బంధించిన చెఱసాలల పునాదలింకను సడలలేదే! తపస్సంపన్నులను దాడి

యుండిన బందిఖానయు పావనకారాదె! ఏమైన
త్యాగమహిమ? సత్యమునకు కెత్తువచ్చినదా? "ధ
ర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" యను
సూక్తి వ్యర్థములేదా? దేవుఁడున్నచో న్యాయము కలిగిం
చుకొనఁడేమి? కష్ట సుఖములు లెక్కఁజేయరా,
కేవలము సాక్షీభూతుఁడై యుండు వాఁడున్ననేమి! లేకు
న్ననేమి? ఎవరికిగావలెను? సర్వనాశనకై పిన్నట
సాఁడు వచ్చిననేమి! రాకున్ననేమి! ఓరా!
దారిద్ర్యముకన్న భయంకరమైనది లోకమున వేఱొ
కటిలేద గదా! దీనికన్న మరణమే వేయిరెట్లుమేలు

కాలము మారిపోయినది ధనమేనాఁడు
పరిపాలించుచున్నది, ధనవంతుఁడేరాజు, ధనవంతుఁడే శా
సనకర్త మధురకవితా విలసితుఁడై, మహిమవలయ
మొందగిన కవిసార్వభౌముఁడైనను, ధనహీనుఁడైన నెందుల
కును కొఱగాఁడు గిరిశిలాతతులు సైతము కరిగిపో
వ దివ్యగానము సేయు గాయకుఁడైనను, ధనహీనుఁడై
న, నప్రయోజకుఁడగును లౌకిక వ్యవసాయపన్నుఁడై,
లోకము లెంచఁదగిన ప్రతిభాశాలియైనను, ధనహీనుఁడైన
పలుకరించువారుండరు ఎంత తెలివితేటలు గలవాఁడైన

నేమి ? ధనహీనుడెందులకు పనికిరాడు. సభలకాహ్వా
నముండదు సంఘమునమర్యాదలేదు ప్రజలలో పలు
కుబడియున్న . (అటునిటు చూచి) నరేంద్రు
డా, ఆ వచ్చుచున్నది ?

( నరేంద్రుడు ప్రవేశించును )

రామ — నరేంద్రా ! ఎక్కడనుండిరాక ? పాదరక్షలు గూ
డ లేకుండ తిరుగుచుంటివే ?

నరేం — పాదరక్షలకేమిలే ?

రామ — అనగూడదుగాని నీవు నీ స్థితిగతుల గుర్తె
ఱుగక సంచరించుచుంటివి సుమా !

నరేం — నీమాటలు నాకర్థమగుటలేదు.

రామ — అర్థమగుటలేదా ? నీవు పోషించవలసిన వారా
రుగురున్నారు తెలియునా ?

నరేం — తెలియుటకేమి ? మాతృదేవి క్షుద్బాధచే మాడు
చున్నదనిగూడ నెఱుంగుదును,

రామ — గ్రహించి ప్రయోజనమేమున్నది ? తన్నివారణో

పాయ మూహింపవలెగదా ? కడుపునిండిన వెనుక
గదా ఎన్ని వేదాంతములైనను ?

నరేం — ఆమాటలెందులకు ? ఇట్టిచే మానవుని ప్రజ్ఞావిశే
షములు బయల్పడును ఘోట్టములు, దుర్బలులను దరి
ద్రియు, వడింత బాధించుచుండును దరిద్రదేవత భీక
రాకృతి వహించి, కోఱలు తెఱచికొని, మీదబడ నుం
కించుచున్నను, కష్టపరంపరలు వెన్నంటి, తఱుముచున్న
ను, చలింపక, జ్ఞానకృపాణహస్తులై ప్రతికష్టవ్యూహ్రి
మును, ఎదుర్కొను ధీరులను, దుఃఖములు సమీపింప
జాలవు సుమా!

రామ — నిజమే! చలింపకుండ నుండవలసినదే, గాని సంభ
వించినపుడు తరణోపాయ మాలోచింపవలదా ?

నరేం — ఆలోచించి ప్రయత్నించితిని

రామ — ఫలితము ?

నరేం — ప్రయత్నమే నావంతు

రామ — ఏవిధముగ ప్రయత్నించితివి ?

నరేం — ఏ స్వల్పయుద్యోగమైనను లభించిన చాలునని గడ
ప గడపకు దిరిగితిని

రాము — ప్రార్థించితివా ?

నరేం — లేక తిరిగి తిరిగి ప్రాణము విసిగినది

రాము — ఇంత చదువుకొన్న నీకుగూడ దుర్లభమైనది ?

నరేం — ఈ చదువింత నిరర్థకమగునని యెన్నడును తలచలేదు. ఎందులకును కొఱగాని ఈ విద్యావిధానము నిరసింపదగినది సుమా ! డబ్బాపాల కలవాటుపడిన శిశువువలె, విజాతీయవిద్యాభ్యాసమున కలవాటుపడిన మనయువకులెంత దుర్బలహృదయులగుచుండిరో తెలియునా ?

రామ — ఔను. పాశ్చాత్య నాగరికతాధారైక స్థాపిత విశ్వవిద్యాలయములలో విద్యార్థులు, గాజుపాత్రిలలో పెంచిన వృక్షములరీతి, తయారగుచున్నారు ! వారిమానసములకు, వికారాకృతి కొసంగి, వారి జీవితములనే కృత్రిమములుగ జేసివైచుచున్నది సరిగాని, ఇపుడు జరుగవలసినది యేమి ?

నరేం — మఱియొక చోటికేగి ప్రయత్నించెదను

రామ — మంచిది పోయిరమ్ము

(నరేంద్రుడు నిష్క్రమించును)

రాము — ఇక సన్యాసుండక పాపము! ఈ నడియెండను కూడు, కాలికి జోడు ను లేకుండ, ఉద్యోగము కొఱకు, ప్రైమెస వారి నిల్ల, నాశ్రయించుచు వీధి వీధిని తిరుగుచున్నాను ఔరా! కాల మహిమ నకెం గ్రినివాట ధరాలికి కూడు నొకరిల బింపక పోయెనే? ఆశ్చర్యము!

(విస్మరించుచు)

# రంగము VI

(నరేంద్రుడు ప్రవేశించి)

నరే. — పొట్టకూటికి నేనొకరికిగులామునై పడియుండ
ట, భగవంతునికిష్టములేదుగాబోలు లేకున్న విఫలమ
నోరమడనగుదునా? కానమ్మ తిండికేమి?
భగవంతుని బ్రత్యక్షముగా జూచుచున్న మహానుభా
వుడగు గురువరేణ్యుని వేడుకొనెదగాక! తనదేవి సా
యమున, నా దారిద్ర్యము నా మహాత్ముడు తొలగిం
పలేకపోవునా? ఆహా! నేనెట్టిమూఢుడను!
శ్రీరామకృష్ణుడు దివ్యవిగ్రహము ఆద్యంత ర
హిత హిందూ తాత్త్వికావలోకనసారము, సర్వకళా
పరిపూర్ణమై వెలసిన పవిత్రమూర్తియె శ్రీరామకృష్ణు
డు అంతటి మహాతపస్సంపన్నుని పరిఘటించి, నేనెం
తటి యగ్నిపరీక్ష జేసితిని? నా సంశయాత్మకమగు
మానసమును, ప్రత్యక్షానుభవజ్ఞానతరంగములచే తడి

పి, నిర్మలానందరసముచే నింపి వైచెనుగదా? పాశ్చా
త్యవిద్యాశయములతోడను, బ్రహ్మసమాజతాత్వికా
భిప్రాయములతోడను, హిందూమతాశయములకెదు
రీదబ్రయత్నించిన, నాకు, ప్రప్రథమమున, గురువరే
ణ్యుడు పిచ్చివానివలె దోచుటయందాశ్చర్యమేమున్న
ది? శరీరముకాలుచున్నను చలింపక, అత్యచ్ఛ
ఆనిర్వికల్పసమాధిమగ్నుడై, నిలిచి యుండు ఆ మహా
త్ముడు సామాన్యుడే! సంకల్ప సిద్ధుడగు రామ
కృష్ణుని నిర్హేతుక జాయమాన కరుణాకటాక్షవీక్షణ
ములు, నాపై బ్రసరించుచుండ, నాకే కొఱంతయు
నుండదుగదా? గాని, నాకంతకంతకు దైన్య
మధికమగుచున్నదే? జయించగలనా? ఆహా!

తలచినంతమాత్రమున, హృదయము చీలికలగు
చున్నది, మోపలేని భారమువహించి, నవమాసములు
మోసి, నన్నత్యంతగారాబమున సాకి, నాపై కొండం
త యాశబెట్టుకొనియున్న మాతృదేవి, - ప్రేమస్వరూ
పిణి కన్నతల్లి, ఆకలిచే కృశించుచుండ, పరమపవి
త్రంగ నాకై సువర్ణదేహము నలిగి శల్యావశిష్టము

గుచుండు, చూచి యోర్చుకొనగలనా ? ఈ యువావ
సములెన్నాళ్ళు ? దరిద్రదేవతవాగ్రహించి, నీకసన
వ్రతమెన్నాళ్ళు బూనిగలను ? ఏమిది ? భయ
మా ? భ్రాంతియా ? తప్పుదారిద్రొక్క చుం
టినేమి ? స్థిరచిత్తము కావలెను అదియె వాంఛనీయ
ము, చలింపను చిన్నవిజిగి మీదబడినను త
ణకను, నా ప్రియత్నమేమియులేదు. వచ్చిన
రానిమ్ము, పోయిన పోవనిమ్ము, కష్టములు లెక్క ?
శక్తిగలదో, లేదో, చూచెదను గురువరేణ్యునకు
తేలవలెనుగదా సత్యాసత్యములినాడు అందుల
కీ క్షణమెమంచిది నడచెదను
(కొన్ని యడుగులేగునప్పటకి ప్రతాపచంద్రు
డెదురు పడును )

నరేం — ఓహో ! మిత్రుడా ?

ప్రతా — ఏమినరేంద్రా ! ఇట్లుంటివి ? కాలికి జోడేది ?

నరేం — ఎట్లుంటిని ?

ప్రతా —(తనలో) పాపము ! ఇకడు భుజించినట్లు తోచదు
(ప్రకాశముగ) ఎండలో తిరిగితివి గాబోలు వదనము
వాడియున్నది

నరేం — తిరిగి తిరిగి విసువు జనించినది

పవిత్రా — ఫలహారము సేవ్యుదము రమ్మ

నరేం — ఇది వేళగాదు

పవిత్రా — వేళగాకేమి ? నాకాకలియగుచున్నది, పోవుదము రమ్మ

నరేం — ఆకలియగుచున్నదా ? పోయిరమ్ము

పవిత్రా — నీవురావా ?

నరేం — (నవ్వుచు) నాకవసరములేదని చెప్పితినిగదా ?

పవిత్రా — ఎంత పెంకెవాడవు ?

నరేం — పెంకెతనమేమున్నది ? సమయాసమయములు లేవా ? సరిగాని, దక్షిణేశ్వరమునకేగితివా ? విశేషము లేమి ?

పవిత్రా — విశేషములా ? నీ సంగతి గురువుగారికి తెలిసినది

నరేం — ఏసంగతి ?

పవిత్రా — ఉద్యోగమకొఱకు వీధివీధికి దిరుగుట నీ కృషి ఫలింపకపోవుట

నరేం — ఛా ! ?

పత్రితా — ఛీ ! ?

నరేం — తెలిసిన తెలియుగాక, ఆశ్చర్యమేమున్నది ? అబద్ధము లాడక, ఉన్నదున్నట్లు చెప్పుము

( "తనువేలా ఈ దనమేలా ?"
యనుపాట వినబడును)

నరేం — ఎవరాపాడునది ? (ఆలకించును)

పత్రితా — (ఆలకించును)

నరేం — (వ్రేలితో జూపుచు) ఆగృహమునుండియా ?

పత్రితా — అదియొక వేశ్యగృహమని తలచెదను

( మరల, " తనువేలా ?" యనివినబడును )

నరేం — ఆహా ! ఎంతచక్కని పాట ? పత్రితాహా ! వింటివా ? సమీపించుదమా ?

పత్రితా — గుమ్మము కడ నొకవృద్ధనారియున్నది అడిగి చూచెదను (సమీపించుచు) అవ్వా ! అవ్వ !

అవ్వ — ఎవరయ్యా ! ?

పత్రితా — ఈ గృహ మెవరిది ?

అవ్వ — "విద్యాధరి" ది

పరితా — మేము లోనికేగవచ్చునా ?

నరేం — (సమీపించి) అవ్వా ! ఆ పాడునది విద్యాధరియే నా ?

అవ్వ — మీరువచ్చారని చెప్పేదా ?

పరితా — ఔను, నరేంద్రుడొచ్చియున్నాడు, లోనికి రావచ్చునా, యనియడిగిరమ్ము

నరేం — ఓరిపిడుగా ! నాపేరేల జెప్పితివి ?

పరితా — పుట్టి మునుగదులే.

(అవ్వ లోనికేగివచ్చును)

అవ్వ — అయ్యా ! రండి

(అందరు నిష్క్రమింతురు)

# రంగము VII

## —♦ విద్యాధరి గృహాంతర్భాగము ♦—

---

( రాజు పరితాపుడు సోఫాలమీదను, విద్యాధరి నిలువ బడియుందురు )

విద్యా — పూజ్యులరుదెంచినారు అతిథిపూజ

నరేం — అవసరములేదు నీ యాదరణము కొనియాడఁదగి నదే

విద్యా — ఎండవేడిమికి బడలినట్లున్నారు స్నానాదికములకు వలయు, నుష్ణజలమున్నది ఫలహారము సేయవచ్చును.

పరితా — (తనలో) ఏమి యీ వేశ్యసౌందర్యము ?

నరేం — అవేమియు నవసరములేదు. నీ మధురగానము మ మ్మాకర్షించినది

విద్యా — తామరుదెంచుట నాయదృష్టము నవయౌవనదివ్య తేజో విరాజితులగు మిమ్ములను దర్శింపవలెనని, చాలా కాలమునుండి

నరేం — ఓహో! ఇంతకు పూర్వమే మావిషయమెరిగి యుంటివా?

విద్యా — చిత్రము అప్పుడప్పుడు వినియుంటిని మీమహో హరాకృతిని

పత్రితా — (తనలో) సంభాషణము చిత్రముగనున్నదే!

నరేం — మంచిది ఆపాట మరియొకపర్యాయము పాడుము, విని యానందించెదము నీ కంఠమతిమధురమైనది

విద్యా — ఒక్కకంఠమేనా?

పత్రితా — (తనలో) కాదు, నిలువెల్ల

నరేం — అనఅవసరప్రసంగమేల? ఆపాటను

విద్యా — పాటలకేమి? కావలసినన్ని వినవచ్చును విద్యాధరినగు నేను ధనవంతురాలనని గూడ తమకు దెలియునా?

నరేం — అయినాకావచ్చును. నాకేమి?

విద్యా — (చిఱునగవుతో) ఈ మాత్రమర్థముకాలేదా? నాకును, నాధనమునకును మీ రధిపతులయ్యెదరు. నాథా! అనిర్వచనీయానంద

పత్రితా — చాలే

న రే — పాపమేమియుగాక ! తల్లి ! ఇదేటిమాటలు ?

విద్యా — హావ భావ, విభ్రమ, విలాసాదులేవైన నా యందు గోచరించెనా ?

ప్రియా — (మెల్లగ) ఎబ్బే ! ఎవరంటావు ?

నరేం — ఎవరికిగావలెను ? హృదయసౌందర్యము లేనప్పుడ న్నియు నిరర్థకములే పలుమారులద్దమును జూచి మొగమును దిద్దుకొనుటకంటె, సత్కులాంగనలను జూచి హృదయమును దిద్దుకొనలేవా ? తల్లీ !

ప్రియా — సహోదరీ ! భేషైనసమాధానము జెప్పితివోయి !

విద్యా — ఈ నీతులకేమిగాని, ప్రియుడా ! నిష్కళంకహృదయముతో ప్రేమించుచున్నాను సుమా !

నరేం —(కోపముతో) తల్లీ ! చాలింపుము నీవాచాలత్వము ప్రేమయా ? ప్రియయను పదమునకు నీ కర్థము తెలియదు గాబోలు ?

విద్యా — ధనాశచే మిమ్ములను ప్రేమించుటలేదు తెలియునా ?

నరేం — ధనాశగాకున్న, దానితోత మరియొకటి నీ ప్రేమ ప్రతిఫలశూన్యము మాత్రముగాదుగదా ?

తల్లీ! ఎందులకి నీచాతి చమగు పంకి పాలుపడుదువు?
నీ పవిత్రమున, పవిత్రమున, తేజోవంతమున, జేసికొ
నుము

విద్యా — తల్లికిరింపుల మాట్లాడుచుంటి వేల ? నా వివహము
పవిత్రమైనది గాదా ? నాయందున్న పాపమేమి ? నా
ప్రవర్తనమసహజమా ? అదిగో! ఆమల్లెపూలయందె
ట్లు భృంగము, మకరందమును గ్రోలుచున్నదో చూడు
ము! ఇది సృష్టిరహస్యముగాదా ?

ప్రీతా — నరేంద్రా! పాటలసంగతి దేవునికెరుగును పోవుద
ము లెమ్ము

నరేం — ఏమి మాటలు ?

విద్యా — బాల్యమునకు విద్యాభ్యాసమెట్లుగనమో, యౌవ
నమునకు ప్రణయరహస్యములు తెలిసికొనుటగూడ,
నట్టే యలంకారమగునగదా ? వేదాంతమునకు వృ
ద్ధాప్యముండనేయున్నది

నరేం — నీ తెలివి తేటలకు జాలిపడవలెనో, సంతోషింపవ
లెనో తోచకున్నది

విద్యా — జాలిపడిచేరదీయుడు అటులనగు నన్నాదరించి లా

లింపుము; ఇదియును, పరోపకారమేగదా ?

నరేం — ఔనౌను మంచిపరోపకారమే

విద్యా — నా జీవితమున— సర్వమున—నాథా !

నరేం — ఛీ ! అట్లు సంబోధించకుము నిమాటలునకు, మాయలకును, లొంగునంతటి దుర్బల హృదయుడనుగాను

తల్లీ ! రక్తమాంసాస్థికల్పిత శరీరసౌఖ్యమును నమ్మకొని, క్షణికములగు తుచ్ఛసౌఖ్యములకై పరువెత్తెదవు ? అహంకార, మమకారములను చంపుకొనుము శాశ్వతానందమును బొందుటకు బ్రయత్నింపుము నీ విజ్ఞానముచేతను, అప్రతిమాన ధైర్యసాహసాదులచేతను, పరంజ్యోతిని దిలకించుము. లోకకళ్యాణమునకై మానవసేవజేయుము జీవితమును పునీతమును గావించుకొనుము తల్లీ ! ఏల భ్రమపడెదవు ? నీవుకోరునది నిజమగుసుఖముగాదు, ఆలోచించికొనుము ఒక్క సౌఖ్యమున కాశించిన రెండు కష్టములు రాక తప్పవు మనశ్శాంతిలేని యీ పాడుమార్గమేల దొక్కెదవు ? విసిగ్నహృదయముతో

విద్యా — సుకుమారా! ఈ చదువులెవరికి గావలయును? మనసారవలచి తపించుచున్న మానవతిని, సుఖపెట్టజాలని నీ చదువెందులకు? చక్కదనమేల? జన్మమేల? ఇంతప్రార్థించినను నీహృదయము కరుగలేదా? రాక్షసుడా! పాపమని, నరకమని, నన్ను భయపెట్టజూచుచున్నావా? ఒకవేళ స్వర్గమున్నదనుకొన్నను, రంభా సంభోగమునకేగదా, దానినాశించుట? రంభనుమించిన రమణీమణులను కాదని, అనుభవించుటకపారముగబడియున్న భోగభాగ్యములకాలదన్ని, అందనివాటికై ఎగిరిపడుటేల? చేతిలోనున్న వెన్నను విడిచి, నేతికొఱకు పఱుగెత్తుటబుద్ధిమంతుని లక్షణమా? నా మాటవినుము నిన్ను లక్షాధికారిని జేసెదను దాసురాలనై

నరేం — తల్లీ! వినజాలను సెలవిమ్ము పోయివచ్చెదను ప్రతాపా! లెమ్ము

విద్యా — (ద్వారికడ్డముగ నిలువబడి, కన్నీటితో) ప్రియుడా!

వి షే -

అన్యాయము చేయకుము, నిలువుము నిర్భాగ్యుడా ! ఒక్క నిమిషము నిలువుము

( నరేంద్రుడు విద్యాధరిని పట్టుకొనబోయి వెళ్ళిపోను పరితాపము, నరేంద్రుని వెంబడించును )

# రంగము VIII

## —◆ నరేంద్రుని గృహము ◆—

( రామచంద్రదత్తు వాలుకుర్చీలో కూర్చొని
ఆలోచించుచుండును )

రాము — పరితాపుని మాటలు మొదట నమ్మజాలకపోతి
ని అంతయు నిజమే ఇందావంతయు నసత్య
ముండదు ఆఁ! ఎట్టి వాఁడింతలో నెట్లాయెను ?
ఎంతటి దృఢనిశ్చయము ? ఘోరకష్టములపాలై,
చేతకాసైనలేక, కట్టబట్ట, కుడువకూడు లేక, అల్లాడు
చున్న తరుణమున, వేలకొలది రూప్యములును,
నిలింప కామినుల సీటుచు కాలదన్న, సుందరీమణియు,
లభించుచుండ, చలింపకతోసిపుచ్చువారెవరుందురు ?
ఏ మానవుని హృదయము చలింపకుండును ? నరేం
ద్రా! జయించితివిసుమా! ధన్యుడవు! నిత్యసంతో
షివి నీవుగాక మరెవ్వరు ? స్వకుటుంబము భరింపరాని

దారిద్ర్యమునబడి, మ్రగ్గుచుండ నిరశనవ్రతమును బూని గీతామృతపానము సేయుచుంటివా ? నరేంద్రా
ఆహా ! నిక్కమగు స్థితప్రజ్ఞుడవు నీవే భగవద్గీతను చదువుటకు రెండు మూడు గంటలుచాలును గాని దానిసారముచుగ్రోలి జీర్ణింపజేసికొనుట కెన్నిజన్మము లెత్తవలెనోగదా ? భారతీయుల రక్తబిందువులలో, గీతాసారము లీనమైనచో, కర్మాచరణోద్యుక్తులై, నడుములుబిగించి, నిలిచినచో, దాస్యవిమోచనమచిరకాలమునగలుగదా ? హైందవులారా ! భగవద్గీత హిందూమతమునకు ముఖము తెలిసినదా ? భరతమాత, పుత్రులకత్యంత ప్రేమతో నొసంగిన, స్వాతంత్ర్యస్తన దుగ్ధమిదియే ముప్పదిమూడుకోట్ల భారతీయులరక్తనాళములను, చైతన్యప్రభాభాసితములను జేయు, దివ్యామృతధారయిది దేశమాతా ! నరేంద్రునివంటి తనయులున్న నీకేమిలోటు ? భవదమలపాదారవిందసేవైక దీక్షాపరవశులై, త్యాగవహ్నికాత్మబలి నొసంగుటకు సిద్ధముగనున్న తనయులున్నంతవరకు నీకేమిలోటు జననీ ! ఔరా ! నరేంద్రా ! అస్ఖలిత బ్రహ్మచర్యవ్రత దీక్షాబద్ధకంకణుడవై, కామక్రోధా

దులజయించి, జీవితాశయములకు జిచ్చుపెట్టి, మీదు మిక్కిలి కష్టపరంపరలను బాధ్రించి తెచ్చి, నెత్తినిడుకొని, లోకకళ్యాణమునకై జీవయాత్రసాగింప సిద్ధపడిన నిన్నేమందును? వినిర్మలహృదయజ్యోతి నానాటికి దేహమునకు దివ్యతేజము నొసంగుచుండ, స్వచ్ఛసువర్ణచ్ఛాయందనరారుచు, విజాతీయాశములలోని, మంచిని స్వీకరించి, జాతీయాశయముల మేళవించి, హిందూమతమునద్ధరింప నవతరించిన మహాపురుషుడవు గాబోలు?" - సందేహములేదు నరేంద్రా! భవదీయ జ్ఞానప్రవాహ, సమావేశముతో, భావిభారత భాగ్యనిర్మాణ దివ్యవాహిని, హైందవము తపునరుద్ధరణాధారమై, సర్వజనాంగీకారమై విలసిల్లుగాత! మాతా! భువనేశ్వరీ! నీవెంత ధన్యురాలవమ్మా! ఇట్టి తనయుడుదయించినందులకు నీవు గర్వపడవలదా? తల్లీ! నీ బాధభరింపరానిదే, గాని, కష్టములు కలకాలముండవు నీ పుత్రుడులోకోత్తరపురుషుడుగాబోవుచున్నాడు, నీ వేలపరితపించెదవు తల్లీ!

( పరివేశము, భువనేశ్వరి )

భువ — ఏవిటిరా, రామా !

రాము — (తెప్పరిల్లి) లేదే ?

భువ — "భువనేశ్వరీ," యని పిలిచినట్లు వింటినే

రాము — ఓహో ! నా లోని నేదియో, చెప్పకొనుచు, నా పేరు నుచ్చరించితివి గాబోలు

భువ — నరేంద్రుడు జ్ఞాపకము వచ్చినాడా ?

రాము — లేదు

భువ — అక్కఱకువచ్చిన పుత్రుండుండియు, నగచాట్లపడవల సివచ్చిన నాగతి నేమందును ?

రాము — తల్లీ ! అతడు లోకోత్తరపురుషుండనుమా ! నీవేం పరితపించెదవు ?

భువ — ఎవరుచెప్పిరి ?

రాము — అతనిముఖ లక్షణములే చాటుచున్నవి విచిత్రం పరివర్తనము చాటుటలేదా ?

భువ — లేమిడిని సూచించుచున్న ముఖలక్షణములు నీకట్లు తోచుచున్నవిగాబోలు ? ఎంతటి వెఱ్ఱివాడవు ! కన్న తల్లి కన్నముపెట్టలేనివాడు లోకోత్తరపురుషుడగునా ?

రామ — సర్వసంగ పరిత్యాగియగు నాతడు నీ కొఱకు శ్రద్ధవహించునా ? జగత్కుటుంబము నుద్ధరించబుట్టిన మహాత్ముడని, రామకృష్ణుడు చెప్పియుండలేదా ? తపస్సంపన్నుని మాటలబద్ధములగునా ?

భువ — ఐన, నరేంద్రుడిక, నిటకరాడా ?

రామ — రావచ్చును, రాకపోవచ్చును— తామరాకుపై నీటిబొట్టువలె, నతడే ప్రపంచమున సంచరించుచు చున్నాడు

భువ — నన్నీవిపత్సముద్రమునుండి, దాటింపగలవారెవ్వరు, తండ్రీ !

రామ — నరేంద్రుడు తనకష్టములను గురుస్వామి తొలగింప నేగినట్లు తెలియుచున్నది అచిరకాలమున రాగలడు

భువ — బాగున్నది సన్యసి, సన్యాసి, నాశ్రయించిన లభించునది బూడిదయే గదా ?

రామ — అట్లనకుము అతడు సంకల్పసిద్ధుడు, దేవిసాయమున నతడు నరేంద్రుని రక్షింపగలడు

భువ — ఏమో ?

రామ — మాతా! మనశ్శాంతి లేనపుడు గ్రంథపఠనమే తరణోపాయము భాగవతము జదివెదను, లోనికేగుదము, రమ్ము —

(నిష్క్రమింతురు)

# రంగము IX

(రామకృష్ణుడు సమాధిలో నుండగా, నరేంద్రుడు ప్రవేశించి కూర్చొనగ)

రామ — (కనులతెరచి) వచ్చితివా, నరేంద్రా!

నరే — ఇప్పుడే వచ్చితిని

రామ — నీ యాగమనము దేవినాకు నాకు తెలిపినది సుమా!

నరేం — దేవి మీకిప్పుడు గనపించినదా!

రామ — ఇప్పుడేయననేల? ఎప్పుడును ప్రత్యక్షమే (కనులుమూయును)

నరేం — ఆశ్చర్యము!

[ ఆనందబాష్పములు గ్రమ్మ, రామకృష్ణుడు కనుల దెరచి నరేంద్రుని జూచును నరేంద్రుడు కన్నీరు గార్చును ఒకరి నొకరు జూచుకొందురు ]

రామ — అర్థమైనదా ?

నరేం — ?

రామ — మాతనుసేవింపుము లోకమునుద్ధరింపుము

నరేం — స్వామి! దాసుడొక సాయము నపేక్షించుచున్నాడు

రామ — కుటుంబరక్షణమేనా ?

నరేం — చిత్తము భరింపలేకున్నాను, నా కొరకు దేవిని ప్రార్థింపుడు స్వామి !

రామ — ఈ విషయము నేను దేవినడుగుదునా ?

నరేం — మతినాగతి ?

రామ — నీవే మాతనడుగుము

నరేం — నాకు పరిచయము లేదుగదా ?

రామ — లేకున్న కలిగించుకొనుము నిశ్చలుడవై, చూచుటకు సంకల్పించుము

నరేం — మార్గమగోచరముస్వామి !

రామ — నరేంద్రా! మనసుండిన మార్గముండదా ? నేడు మంగళవారము శుభప్రదమగు సమయమిది ఆల

యమునకేగి మనసారప్రార్థించి, నీకష్టములు విన్నవిం
—చుకొనుము పోయిరమ్ము

నరేం — చిత్తము

(నరేంద్రుడు పార్శ్వమున నున్నకాళికాలయమున
ప్రవేశించుచు)

నరే — నడకలు మందగించుచున్నవేమి ? దేహము కంపిం
చుచున్నదే ? శరీరము తేలికయగుచున్నది (దేవి
ని సమీపించుచు) ఓహో ! ఏమిచైతన్య ప్రకాశ
ము ? నిర్జీవప్రతిమ సజీవమై తేజరిల్లుచున్నది నేత్ర
గోళములు మిరుమిట్లు గొల్పు కాంతితో ప్రజ్వరిల్లు
చున్నవి ఇదేమి ? ఏ దివ్యశక్తియో, నాహృద
యాంతరాళమున ప్రవేశించుచున్నదే ? (ఆలకిం
చుచు) శబ్దమేదియో శ్రవణగోచరమగుచున్నది
దేవి ! చూచితిని, సంశయవిచ్ఛేదమైనది తల్లీ! ధన్యో
స్మి ! ధన్యోస్మి ! సమస్త జడపదార్థములయందు సైత
ము, నీవుంటివనియు, పరిపూర్ణాత్మశక్తి ప్రకటనావ
కాశములకై, వేచియుందువనియు, నిప్పుడు గ్రహించి
తిని, ఆఁ! ఏమనచున్నావు ? తల్లీ ! "ఏమికావలె

"ఏయా ?" ప్రశ్నించుచున్నావు ఇంకేమి గావలెను ? నీ దర్శనభాగ్యము లభించినది గదా ? ఇదే, కాపాడ్రిపడి సర్వకాలసర్వావస్థలయందును, పవిత్రహృదయుడనై, నిన్ను ధ్యానించు యోగ్యతను బ్రసాదింపుము తల్లీ ! పాపభూయిష్టములగు తుచ్ఛసౌఖ్యముల కాసింపను క్షణికములగు లోకవ్యవహారముల గోరను, సంతోషానందముల యంకతలముల గూర్చొనుటకననగు సత్యస్వరూపమును దయచేయుము మాతా ! (కనులు మూసి, యొక క్షణము నిలిచి బయలుదేరి, రామకృష్ణుని సమీపించును )

రామ — నరేంద్రుడు దేవిని దర్శించి వచ్చుచున్నాడు ,

ఆహా ! అతని కమనీయ ముఖారవిందమెంత తేజోవంతమైనది ? మానసాంతర్గతమైన, భక్త్యావేశము లావదన మండలమున విస్పష్టముగ జిత్రింపబడినది మల్లికాకుసుమ ధావళ్యమును ధిక్కరించు, దంతపంక్తి యాతనిహృదయనైర్మల్యమును జాటుచున్నది

(నరేంద్రుడు సమీపించును )

రామ — మాతను, దర్శించితివా, నరేంద్రా !

నరేం — భవదాశీర్వచ బల ప్రభావముచే, దేవితో స
భాషింపగలిగితిని స్వామీ! బ్రహ్మానందమనుభవించి
తిని

రామ — వరమొసంగినదా?

నరేం — లేదు, మహాత్మా! నే నా విషయ మడుగమఱచి
పోయితిని

రామ — మఱచితివా? బుద్ధిలేనిపని జేసితివేమి? నీకష్టము
లామెకు విన్నవించుకొనుము మఱచిపోయిరమ్మ

నరేం — చిత్తము

[ నరేంద్రుడు నిష్క్రమించును
రామకృష్ణుడు సమాధిలో నుండును ]

రామ — (కనులు తెరచి) ఆహా! ఎంతటిస్థిరచిత్తము ఈన
రిగూడ నదేజరిగియుండనోపు

(నరేంద్రుడు సమీపించును)

రామ — ఏమి నరేంద్రా?

నరేం — మహాత్మా! ?

రామ — అడిగితివా ?

నరేం — క్షమింపుము అడుగుటకు మనసొప్పలేదు.

రామ — ఎంతటి యవివేకము? "అడుగకున్న నమ్మయైన పెట్టదు" తెలియునా ?

నరేం — ఎఱుగుదును.

రామ — ఇప్పుడేమిచేయుదువు ?

నరేం — మఱియొక పర్యాయ మేగి తప్పక యడిగి వచ్చెదను సెలవా ?

రామ — మంచిది.

(నరేంద్రుడు నిష్క్రమించును)

రామ — ఇతడీ నారిగూడ నదేవిధముగ రాగలడు కానిమ్ము సంకల్పించిన కార్యము సఫలమైనది ఉత్తమ మార్గమున బెట్ట గలిగితిని గదా ?

నరేం — (నడచుచు) ఛీ! ఛీ! సిగ్గు! రాజాధిరాజును దర్శించి కూరగాయలడుగుకొను మూఢులుందురా ? దేవినీస్వల్ప విషయమా అడుగవలసినది? నేనట్లు చేయను (వెనుకకు దిరిగి రామకృష్ణుని సమీ

పించి, తీవ్రముగ) గురువర్యా! ఇదంతయు మీ మోసమే? గ్రహించితిని   లేకున్న మూడుపర్యాయములు దేవిని దర్శించియు అడుగదలచిన దాని నడుగలేకపోదునా? ఏటిమాటలు?

రామ — (నవ్వుచు) నరేంద్రా! ధన్యుడవు! భయపడకుము నీకుటుంబమున కికముందు, పుట్టుకను, ఒట్టకును మాత్రము లోపముండదు   నీవు శ్రద్ధవహింపవలెను దీకుటుంబము కొఱకుగాదు మఱియొక పె కుటుంబము నీపై నాధారపడియున్నది (ఆశీర్వాదపూర్వకముగ) మానవ సేవ జేయుము లోకముద్ధరింపుము

నరేం — మహాప్రసాదము

# END.

# తప్పొప్పుల పట్టిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| "ప్రశంస" | 1 | ప్రిసంశ | ప్రశంస |
| 1 | 8 | ఆన్య | అన్య |
| 10 | 10 | నిష్ట | నిష్ఠ |
| 14 | 2 | యాశ | నాశ |
| 14 | 7 | యనమానము | నమమానము |
| 15 | 10 | ఆనతికాలము | అనతికాలము |
| 18 | 3 | స్థియందుండుట | స్థితియందుండుట |
| ,, | ,, | తటస్తించినది | తటస్థించినది |
| 19 | 12 | సచ్చితానంద | సచ్చిదానంద |
| 24 | 7 | యెలుగెత్తి | నెలుగెత్తి |
| 30 | 13 | ప్రిత్యాత్మానుభజ్ఞావన | ప్రత్యక్షాను [భవజ్ఞాన |
| 32 | 1 | యువ్వాప | యుపవా |
| 37 | 10 | అనఅవసర | అనవసర |
| 42 | 4 | పోను | పోవును |